శ్రీరస్తు.



శ్రీ

# వరము వెంకటేశ్వర

## సీసపద్యశతకము.

మైన యీ ♦ క్షితిమండలంబున
భూరివిద్యాతపో౽ ♦ ధారులైన
ధారుణీసురవరు ♦ ల్దదనువర్తనులైన
బేరులు సంపూర్ణ ♦ వివిధధాన్య
ధనసమృద్ధినిగాంచి ♦ మను శూద్రజనులచే
ననుపమానవిభూతిఁ ♦ దనరిమిగుల
వాసికెక్కిన బొల్ల ♦ వరపురంబున శ్రీని
వాసమూర్తి సదాని ♦ వాసమాత్మఁ

గోరి యప్పూరికుత్తర ♦ గోత్రియందు
భూరినిత్యోత్సవంబులఁ ♦ బూర్ణుఁడగుచు
వెంకటేశ్వరనామంబు ♦ వెలయఁదాల్చు
దేవదేవునిగీర్తింతు ♦ దినదినంబు.

# వెంకటేశ్వరశతకము

దేవదేవ మహాత్మ ♦ దీనమందార తా
శ్రీనివాసుఁడ నీదు ♦ సేవకులకుఁ
బారాయణార్థమై ♦ భూరిభక్తిరసంబు
మీఱుపద్యంబుల ♦ నూఱుచేసి
నీకర్పణముచేసి ♦ నిజదాసజనులలో
నాకల్పముగనుండ ♦ నాత్మఁదలఁచి
మామిళ్లపల్లెనా ♦ మాంకితశేషాఖ్య
కవినేను సద్భక్త ♦ గణముపొగడఁ
జేసెదను బద్యశతకంబు ♦ స్థిరముగాను
బొల్లవరమునఁబరదేశి ♦ బ్రోచుటకును
భూరివై భవములఁబరి ♦ పూర్ణలీల
వెలసినట్టి రమాధీశ! వెంకటేశ.

ఇల్లువాకిలిఁబాసి ♦ యిల్లాలినెడఁబాసి
తల్లిదండ్రిగురుండు ♦ దైవతంబు
నెల్లబంధుజనంబు ♦ నీవకామది నెంచి
కల్లసంసారంబు ♦ కడకఁద్రెంచి
భావించిసర్వంబు ♦ బ్రహ్మమయంబుగా
సంచరించుముముక్షు ♦ సంగుఁడగుచుఁ
బరిపక్వహృదయుఁడై ♦ పరిపూర్ణభావంబు
గురుకటాక్షంబుచే ♦ గురుతెఱింగి
యెల్లవిభవంబులాత్మలోఁ ♦ గల్లనుచుఁ
దలఁచి నినుఁగొల్చుపరదేశి ♦ ధన్యుఁజేయ
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ.

నీపాదయుగసేవ ♦ నిర్మలానందంబుఁ
బ్రాపింపుటకు ద్రోణివ ♦ పద్మనాభ
నీపాదయుగసేవ ♦ నిబిడసంసారాబ్ధి
గడ తేరుటకు నావ ♦ కామదేవ
నీపాదయుగసేవ ♦ నిఖిలపాపారణ్య
దావాగ్నిహోత్రంబు ♦ ధాతృజనక
నీపాదయుగసేవ ♦ నిజభక్తజనమనః
కామితార్థములకుఁ ♦ గల్పవల్లి
యెల్లవిభవంబు లాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
దలఁచి నినుఁ గొల్చు పరదేశి ♦ ధన్యుఁ జేయ
బొల్లవరమున నిత్యావి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౪.

కమలాక్ష ననుఁ జాలఁ ♦ గరుణఁ జూడవదేల
కమలాహృదయలోల ♦ కనకచేల
నతభక్తమందార ♦ నానావిధవిహార
నవమన్మథాకార ♦ భవవిదూర
శరణార్థిజనపోష ♦ చారుకౌస్తుభభూష
గురుయోగిహృదయని ♦ గూఢవేష
వారినీలనిభదేహ ♦ హతభక్తజనమోహ
పరదేశిహృదయాబ్జ ♦ పరమగేహ
యెల్లవిభవంబు లాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
దలఁచి సేవించు పరదేశి ♦ ధన్యుఁ జేయ
బొల్లవరమున నిత్యావి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫.

నీపాదపద్మము ♦ లెన్నఁడనమ్మినాఁడ నా
పాపామయంబులఁ ♦ బాపుమయ్య
యీపాపసంసార ♦ కూపంబులోనుండి
చేపట్టినన్నాదరిఁ ♦ జేర్చుమయ్య
కోపాదిదుర్గుణా ♦ టోపంబుఁదొలఁగించి
నీపాదయుగభక్తి ♦ నిలుపుమయ్య
నాపాలిదైవంబ ♦ నాపెన్నిధానంబ
యేపట్టులేనిన ♦ న్నేచకయ్య
యెల్లవిభవంబులాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
దలఁచినినుఁగొల్చుబరదేశి ♦ ధన్యుఁజేయ
బొల్లవరమునవిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౬.

కామాదిదుర్గుణ ♦ గ్రామాహిదష్టమై
నామానసబలంబు ♦ నాశమొందె
వేమారునీదివ్య ♦ నామాక్షరంబుల
నామోములోపల ♦ నాననీవె
నీమంత్రమునుజగ ♦ క్షేమంకరామధీ
సామర్థ్యమునవిత్య ♦ సౌఖ్యమీవె
నీమాయఁదొలఁగించి ♦ నామీఁదఁగృపనుంచి
ప్రేమార్ద్రదృష్టి నా ♦ క్షేమమెంచి
కరుణఁబాలింపకున్ననో ♦ కమలనాథ
నాకుదిక్కెవ్వరిఁకనీవె ♦ కాకధరణి
బొల్లవరమునఁ బరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౭.

హేమాంబరాదుల ♦ నెంతయార్జించినఁ
గామంబునకుఁదృప్తి ♦ గలుగఁబోదు
పిండివంటల నెంత ♦ దండిగాఁదిన్నను
నాలుకపైయాశ ♦ చాలుననదు
భామలతో నెన్ని ♦ మార్లుభోగించిన
మైథునాసక్తియు ♦ మానఁబోదు
కోమటి కెన్నేని ♦ కోట్లధనంబున్న
వ్యాపారమునవాంఛ ♦ వదలిపోవ
దిట్టియాశలు జగతిలో ♦ నెక్కువయ్యె
నిన్నుఁజింతించు టెన్నఁడు ♦ నీరజాక్ష
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౮.

హింసాపరంబగు ♦ సంసారమునునమ్మి
కంసారిపదసేవ ♦ గాననైతి
దారపుత్రాదుల ♦ భూరివాంఛలఁదీర్పఁ
గోరి శ్రీహరిభక్తిఁ ♦ గొల్వనైతి
బాలలీలాలాప ♦ పారవశ్యమునొంది
పద్మనాభునిపేరు ♦ పలుకనైతి
ముప్పుదేహంబున ♦ కుప్పతిల్లెనిఁకేమి
చెప్పుకొందుజముండు ♦ రొప్పికొనుచుఁ
గట్టికొనిపోవునింకెట్టి ♦ గతియునాకుఁ
దప్పులన్నియుమన్నించి ♦ దయనుబ్రోవు
బొల్లవరముననిత్యవి ♦ భూతిమెఱయ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౯.

ఆశాపిశాచికా ♦ వేశంబుగల్గిన
మంత్రసామర్థ్యంబు ♦ మంటిపాలు
దారిద్ర్యమనుదావ ♦ దహనంబుదరికొన్న
బుద్ధిబలంబెల్లఁ ♦ బూదిపాలు
సంసారవిషయవాం ♦ ఛలుచాలఁగల్గిన
ధర్మకర్మంబులు ♦ ధరణిపాలు
కామినీజిజ్ఞాస ♦ కడుదుస్సహంబైన
గురుదేవతాభక్తి ♦ గుంటపాలు
నిట్టివిషయంబులాత్మలో ♦ నెట్టికొనిన
నెట్టివిద్వాంసుఁడును జెడు ♦ హేతువులివి
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౧౦.

దాసోహమనియంటి ♦ దర్శనంబిమ్మంటి
శ్రీసమేతహరిప్రి ♦ సీదయంటి
నారాయణాయంటి ♦ నామొఱల్వినుమంటిఁ
జేరిభక్తునిదయ ♦ సేయుమంటిఁ
బాపాత్ముఁడరమేశ ♦ పాలింపుమాయంటిఁ
దాపత్రయంబును ♦ బాపుమంటి
వాసుదేవుఁడనాకు ♦ వరములిమ్మనియంటి
గాసిజెందించక ♦ కావుమంటి
నెల్లవిషయంబు లాత్మలోఁ ♦ గల్లలనుచు
దలఁచినిన్నుఁగొల్చుపరదేశి ♦ ధన్యుఁజేయ
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
మెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౧.

శ్రవణమంగళములై ♦ నవనవామృతరస
ద్రవములూరెడుహరి ♦ దాసకథలు
సెప్పెడిపండిత ♦ శ్రేణికిమర్యాద
దప్పెఁబండితవేష ♦ ధారులగుచు
మేళతాళంబుల ♦ మేళవించివిదేశ
గౌళబంగాళరా ♦ గములుబాడి
నాట్యాభినయముల ♦ నాణెంబుగాఁజూపి
బూటకములప్రొద్దుఁ ♦ బుచ్చువారి
కమితమర్యాదసేయు దు ♦ రాదరించి
కాలధర్మములీరీతిఁ ♦ గానుపించె
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౨.

చిత్తంబునీపాద ♦ చింతనామృతమాని
మత్తిల్లుటెన్నఁడో ♦ మదనజనక
వక్త్రంబునీనామ ♦ వైభవంబునుతించి
వడిఁజెందుటెన్నఁడో ♦ వనజనాభ
కర్ణములీగుణ ♦ కథలనాకర్ణించి
కడతేరుటెన్నఁడో ♦ కంసవైరి
కన్నులునీమనో ♦ జ్ఞాకారమీక్షించి
చెన్నొందుటెన్నఁడో ♦ శ్రీనివాస
నిన్నుఁగొనియాడఁగాలేని ♦ నిఖిలకరణ
నిచయమెల్లనువృథగాదె ♦ నీరజాక్ష
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౩.

నీపదాబ్జమరంద ♦ నిష్యందమగుగంగఁ
దలఁదాల్పఁడేయైదు ♦ తలలవేల్పు
నీమహామహిమాంబు ♦ నిధిచాలఁగొనియాడి
వాల్మీకిమునులలో ♦ వన్నెగాంచె
నీనామరూపము ♦ ల్నిరతంబుసేవించి
హనుమంతుడెంతేని ♦ ఘనతఁజెందె
నీకాలిదూళిమై ♦ సోఁకిగౌతమునాతి
రాతిరూపమువాసి ♦ ఖ్యాతినొందె
మీమహత్త్వంబునకుమితి ♦ మేరగలదె
తెలిసివర్ణింపనెవ్వరి ♦ కలవిగాదు
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౪.

పుణ్యతీర్థంబుల ♦ మున్గిసేవించిన
భక్తిలేకయెముక్తి ♦ పడయరాదు
దానధర్మంబులఁ ♦ బూనిచేసినఁగాని
భక్తిలేకయెముక్తి ♦ పడయరాదు
ఉపవాసనిష్ఠల ♦ నొడలుగృశించిన
భక్తిలేకయెముక్తి ♦ పడయరాదు
యజ్ఞయాగంబుల ♦ నాచరించినఁగాని
భక్తిలేకయెముక్తి ♦ పడయరాదు
కలియుగంబునభక్తి ము ♦ ఖ్యంబటంచుఁ
బరమభాగవతోత్తము ♦ ల్పలుకవినమె
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౫.

చేపవై ప్రళయాబ్ధి ♦ లోపలఁజరియించి
వేదచోరునిజంపి ♦ వెలసినావు
తాబేటిరూపంబు ♦ దాల్చికవ్వపుఁగొండ
మూపునవలీల ♦ మోచినావు
వారాహరూపంబు ♦ వహియించికనకాక్షుఁ
జీరిధారుణిక్రిందఁ ♦ జేరినావు
నరసింహరూపంబు ♦ ధరియించిసురరాజ
పరిపంథిఁబరిమార్చి ♦ ప్రబలినావు
వటుఁడవై బలిబంధించి ♦ వఱలినావు
పటుకుఠారంబుచేరాజ ♦ పటలిదుంచి
స్వర్గసోపానములగట్టు ♦ పరశురామ
వేషుఁడవు బొల్లవరపురి ♦ వెంకటేశ. ౧౬.

ద్రుహిణుపంపునసుర ♦ ద్రుహులఖండింపఁగా
నరుణాంశుకులమునం ♦ దవతరించి
తపసిజన్నముగాచి ♦ తపనవిక్రముఁలైన
ఖరదూషణాదుల ♦ గర్వమణఁచి
హరువిల్లుఖండించి ♦ యవనిజవరియించి
పరశురామునిభంగ ♦ పఱచితండ్రి
పనుపునవనికేగి ♦ పద్మాక్షిఁగోల్పడి
సుగ్రీవసఖ్యవి ♦ స్ఫూర్తిదనరి
వాయుసుతుఁజేతజానకి ♦ వార్తదెలిసి
కంధిబంధించిరాక్షస ♦ గణముద్రుంచి
రామనామంబుభువిని వి ♦ రాజిలంగ
వెలసితివి బొల్లవరపురి ♦ వెంకటేశ. ౧౭.

ఎల్లభూతంబులం ♦ దేకస్వరూపమై
పరమాత్మయనిమను ♦ ల్ప్రణుతిసేయ
నిండినిశ్చలమై య ♦ ఖండభావంబున
నండపిండాండబ్ర ♦ హ్మాండములను
మెండుగావెలుగొందు ♦ చుందు దేవుఁడవీవె
యొండెద్దియును లేదు ♦ ఖండితముగ
పుండరీకాక్ష యో ♦ పురుషోత్తమ సవిత్రు
మండలాంతరదీప్య ♦ మాననీకు
దండములు సేసి వినుతింతు ♦ ధాతృజనక
యెల్లవిభవంబులాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
దలఁచి నినుఁగొల్చు పరదేశి ♦ ధన్యుఁజేయ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౧౫.

సిద్ధసాధ్యమునీంద్ర ♦ సేవ్యమానంబయి
తిరుపతియనుపేర ♦ ధరణిలోన
బరిపరివిధదివ్య ♦ ఫలవృక్షముల చేత
నిరుపమానైశ్వర్య ♦ నిలయమగుచు
నిరవొందు శేషాఖ్య ♦ ధరణీధరముపైనఁ
గరమర్థిభక్తుల ♦ గణములిచ్చు
కానుకల్గప్పము ♦ ల్గైకొని వారికి
వరములిచ్చుచు నిత్య ♦ వైభవములఁ
జెలగు దేవుఁడ పరదేశి ♦ చేయుపూజ
స్వీకరించుటకిపుడు వేం ♦ చేసినావు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ ౧౬.

దేహగేహములందు ♦ మోహముంచఁగరాదు
విడచిపోయెడువేళ ♦ వెంటరావు
సంపదల్పతమని ♦ సంతసింపఁగరాదు
శంపాలతలమాడ్కి ♦ చలనమొందు
దారపుత్రాదులఁ ♦ దవిలినమ్మఁగరాదు
రాజువెంబడినను ♦ రక్తులగుచు
సుఖదుఃఖములురెండు ♦ సుస్థిరంబులుగావు
మాపురేపులగతి ♦ మాఱుచుండు
బుణ్యపాపంబులవిరెండు ♦ పురుషువెంట
నరుగుచుండునువానిని ♦ మఱువఁజనదు
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బోఁచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! వెంకటేశ. ౧౦.

కొండనెక్కెడుభక్త ♦ కోటులర్పించెడు
దండప్రణామశ ♦ బ్దంబులెసఁగ
గణగణయనుకంచు ♦ గంటలమ్రోతలు
వీనులనమృతంపు ♦ సోనగురియ
నుత్సవార్థము తెచ్చి ♦ యునిచినమత్తేభ
ఘీంకారమాత్మకుఁ ♦ గేళిసలుప
వేదపారాయణ ♦ వాదనాదములాత్మ
కాదరాహ్లాదంబు ♦ లావహింప
కొండపైవేడ్కఁగొలువుండి ♦ కుతలమందు
భక్తజనులనుగావనా ♦ సక్తిమేట
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౧౧

క్లేశబంధములిచ్చి ♦ కీర్తించుభక్తుల
క్లేశబాధలవిద ♦ ళించినావు
నిందుదోఁపులనిచ్చి ♦ నిన్నుఁగొల్చినవారి
కండయైయాపద ♦ లార్చినావు
కొప్పెరలోఁద్రవ్య ♦ మొప్పగించినవారి
తప్పులమన్నించి ♦ తనరినాఁడ
వుత్సవంబులుఁజేయు ♦ నురుగుణాఢ్యులభక్త
వత్సలత్వమునఁగా ♦ పాడినావు
భక్తజనములకీరీతి ♦ భద్రములిడి
భక్తవత్సలుఁడనుపేర ♦ ప్రబలినావు
బొల్లవరముననిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౨.

ఏదేవునామంబు ♦ వేదంబులమొదళ్ల
నాదిమస్వరమయి ♦ యతిశయిల్లు
నేదేవునకుఁబృథి ♦ వ్యాదిలోకములెల్ల
క్రీడార్థసాధన ♦ క్రియఁదనర్చు
నేదేవునకుఁజతు ♦ ర్వేదాదివిద్యలు
శాసనవాక్యసం ♦ చయములగును
నేదేవునకుశాశ్వ ♦ తైకవిజ్ఞానంబు
నిజరూపముగబుధుల్ ♦ నిర్ణయింతు
రట్టిదేవుఁడవీవెయీ ♦ యఖిలజగముఁ
బట్టిపోషింపశేషాఖ్య ♦ పర్వతమున
నెట్టుకొనిబొల్లవరమున ♦ నిఖిలజనుల
వేగరక్షింపవేంచేయు ♦ వెంకటేశ. ౨౩.

ఏ దేవునకుసర్వ ♦ మేదినీసురవర్యు
లాననపఙ్క్తులై ♦ యలరుచుండు
నే దేవునకుధర్మ ♦ మూదినక్షత్రియు
ల్బాహుదండంబులై ♦ ప్రాభిగాంతు
రే దేవునకుసత్య ♦ వాదులౌనద్వైశ్యు
లూరుకాండంబులై ♦ శ్రీరహింతు
రే దేవునకునీతి ♦ వేదులౌశూద్రులు
పాదతలంబులై ♦ ప్రభవహింతు
రట్టినారాయణుండవై ♦ యలరునీవు
నెట్టుకొనియెల్లచోటుల ♦ నిలిచినావు
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౮.

ఈరేడులోకంబు ♦ లేకోదకంబైన
నందునారాయణుం ♦ డనఁగవెలసి
వారిమధ్యస్థిత ♦ వటపలాశంబుపై
బాలలీలవహించి ♦ పవ్వళించి
జగములన్నిఁటినిజ ♦ జఠరంబులోఁజొన్పి
కాలిబొట్టనవ్రేలు ♦ గ్రోలునీదు
లీలావిశేషముల్ ♦ శూలియుమఱితమ్మి
చూలియుబొగడంగఁ ♦ జాలరనఘ
జగములన్నియునీవయై ♦ నెగడినావు
నిగమములునిన్నునుతియింప ♦ నేరవహహా
బొల్లవరమునఁ బరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౯.

# వెంకటేశ్వరశతకము.

పరమభక్తుండైన ♦ పరదేశిచేసెడు
పరమభక్తికిమెచ్చి ♦ పద్మతోడ
ధరణిశ్రీవేంకటే ♦ శ్వరనామమునుదాల్చి
సిరులగుల్కెడుబొల్లి ♦ వరమునందు
నుత్తరదిశనుండు ♦ నుత్తమాలయమున
బుత్రిమిత్రులతోసంగ ♦ బూనిమదిని
నిత్యపూజలునిత్య ♦ నీరాజనంబులు
నిత్యనైవేద్యముల్ ♦ నెఱయఁగల్గి
వెలయుచునుపురజనులకు ♦ వేడ్కలిడుచు
సిరులగుల్కితివౌరయో ♦ శ్రీనివాస
బొల్లివరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౬

కల్లసంసారంబు ♦ కలలోపప్రపంచంబు
కరణినిక్కంబని ♦ కానవచ్చు
నిల్లువాకిలిధనం ♦ బిల్లాండ్రుతలిదండ్రు
లెల్లచుట్టంబులు ♦ హితులుసుతులు
జలబుద్బుదంబుల ♦ చెలువునఁగనుపింత్రు
నెలకొనిచిరములై ♦ వెలయవకట
ముదిమియురోగము ♦ ల్మునసరిదేహంబులఁ
దప్పకకొనిపోవు ♦ దథ్యమయ్య
కానధర్మంబెవెంటరాఁ ♦ గలదటంచు
న్యాయమార్గంబుదప్పక ♦ నడువమేలు
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౭

శరణన్నమాత్రైన ♦ శత్రువునైన ర
క్షణసేయుటకువిభీ ♦ షణుఁడెసాక్షి
పరమభక్తునిప్రేమఁ ♦ బాలింతువనుటకు
బ్రహ్లాదుఁడొక్కఁడే ♦ పరమసాక్షి
చిరకాలమునకైన ♦ మొఱవినిరక్షింపఁ
గరిరాజువిషయంబు ♦ గట్టిసాక్షి
సభలోనఁదనమాన ♦ సంరక్షణమునకై
మొఱపెట్టుపాంచాలి ♦ మొదటిసాక్షి
యిట్టిసాక్షులుగలరునా ♦ కేమిభయము
నమ్మిభజియింపనేయపా ♦ యమ్మురాదు
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౮

పంచేంద్రియాసక్తి ♦ మించిలోకంబున
నంచితాచారంబు ♦ లస్తమించె
చంచలచిత్తులై ♦ జనులుదుష్కార్యముల్
జేయుటనాయుస్సు ♦ క్షీణమయ్యె
క్షీణాయువులబట్టి ♦ శిక్షింపఁగాలుండు
ప్రాణానిలేంద్రియ ♦ వ్యాప్తులైన
జీవాళులనుబట్టి ♦ దావాగ్నిలోనెట్టి
వేయురీతులఁబట్టి ♦ వేల్వఁగలఁడు
కానపాపంబులనుజేయ ♦ మానిసర్వ
మానవులుజ్ఞానవంతులై ♦ మనుటమేలు
బొల్లవరమున పరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౨౯

అర్చాస్వరూపంబు ♦ నాత్మలోఁజింతించి
　　　　కీర్తించుభక్తుల ♦ కిల్బిషముల
బాపిధన్యులఁజేసి ♦ పాలించుబిరుదంబు
　　　　పరమసంప్రీతితోఁ ♦ బట్టిసకల
దివ్యదేశంబుల ♦ దేవతామూర్తినై
　　　　దర్శనపూజాది ♦ ధానములను
జేసిసేవించెదు ♦ జీవకోటులకాత్మ
　　　　సాన్నిధ్యపదమిచ్చి ♦ శాశ్వతమగు
　　ముక్తినొసగెదుదేవనీ ♦ భక్తినాకు
　　కరుణతోడనుదయచేసి ♦ కావుమయ్య
　　బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
　　వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ.　　　　౨౯.

పాంచభౌతికమీప్ర ♦ పంచమంతయునిక్క-
　　　　మంచునెంచిభ్రమించి ♦ మించరాదు
ఎంచిచూచినసర్వ ♦ మీశ్వరాధీనంబు
　　　　చంచలంబధికదుః ♦ ఖాంచితంబు
గానసద్గురుబోధ ♦ మానసంబుననిల్పి
　　　　జ్ఞానియైసతతంబు ♦ మౌనియగుచుఁ
దిరుగుచుసర్వంబు ♦ హరిమయంబనినిత్య
　　　　పరిపూర్ణభావుఁడై ♦ పరగవలయు
　　నెల్లవిభవంబులాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
　　దలఁచినినుఁగొల్చుబరదేశి ♦ ధన్యుఁజేయ
　　బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
　　[illegible] ♦ వెంకటేశ.　　　　౩౦

ఆలుబిడ్డలపైని ♦ నాగ్రహంబొదవించు
శీలవృత్తంబుల ♦ చేవద్రుంచుఁ
జుట్టపక్కంబులఁ ♦ జూడసిగ్గనిపించుఁ
మట్టుమర్యాదల ♦ మట్టగించు
పట్టెడుకూటికై ♦ పల్లెలఁదిరిగించుఁ
జెట్టపనులనుజాలఁ ♦ జేయబంచుఁ
పరివారికంటికిఁ ♦ జాలమిగలిగించుఁ
గలవెప్పుడున్నట్టు ♦ గానుపించుఁ
గాన దారిద్ర్యమీరీతి ♦ కష్టపఱచు
లేమికంటెనుబాపంబు ♦ లేదుధరణి
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. 32.

పండుగపర్వముల్ ♦ ప్రాప్తించినప్పుడు
పేదఱికముకంటెఁ ♦ బీడగలదె
తేరులుతిరునాళ్లు ♦ దెరలివచ్చినయప్డు
పేదరికముకంటెఁ ♦ బీడగలదె
యిష్టబంధువులింటి ♦ కేగుదెంచినయెడఁ
బేదరికముకంటె ♦ బీడగలదె
జంటలై పెండ్లిపే ♦ రంటముల్లను దేరఁ
బేదఱికముకంటెఁ ♦ బీడగలదె
యెల్లపీడలకొన్నద ♦ మెంచిచూడ
పేదరికమంతపాపమీ ♦ పృథివిలేదు
బొల్లవరమున్నఁ బరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. 33.

## వేంకటేశ్వరశతకము.

ఇలలోనదుర్మదాం ♦ ధులగర్వమడగింప
నరయఁ బేదరికంబె ♦ యంజనంబు
కామలోభాంధుల ♦ కన్నులుదెరపింప
నరయఁ బేదరికంబె ♦ యంజనంబు
గురుదైవములదిట్టి ♦ పరిహాసించెడువారి
కరయఁ బేదఱికంబె ♦ యంజనంబు
బీదసాదలబట్టి ♦ పీడించువారల
కరయఁ బేదరికంబె ♦ యంజనంబు
పేదరికమంతపాపంబు ♦ లేదుగాన
దానికన్ననుమరణమెం ♦ తయునుమేలు
బొల్లవరముననిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౩౮.

కలశాబ్ధిలోనీవు ♦ కాపురంబుండి య
క్కరిరాజుగావంగఁ ♦ బరుగులెత్త
కరమర్థిమీతోడఁ ♦ బరుగిడఁజాలక
సరసిజగేహిని ♦ చాలడస్సి
పురపురబాదము ♦ ల్వ్రక్కినెత్తురుగార
గరుణతోనీక్షించి ♦ కడలిఁబాసి
కలినివేంకటశైల ♦ కటకదేశంబున
అలమేలుమంగతో ♦ నరుగుదెంచి
పరమభక్తునిబరదేశిఁ ♦ గరుణఁగావ
బొల్లవరమునకుత్తర ♦ భూమియందు
నిత్యవైభవములతోడ ♦ నిత్యముగను
వెలసినట్టిరమాధీశ! వెంకటేశ. ౩౯.

తర్కింపసర్వభూ ♦ తనివాసుఁడవునీవు
దేవళంబునుబర ♦ దేశియోగి
దృఢతరంబుగపను ♦ ల్దీరిచికట్టించి
పరిపూర్ణభక్తుఁడై ♦ ప్రబలెనహహ
భావింపభక్తుల ♦ భావసంశుద్ధికై
స్థావరరూపంబుఁ ♦ దాల్చిసకల
దివ్యస్థళంబుల ♦ దీపించునీకుర్వి
నీవిశ్వమంతయు ♦ నిష్టగృహము
గానమావంటివారిస ♦ ద్గతికిఁగాదె
దేవళంబునుగట్టించిఁ ♦ తివురుటెల్ల
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. 3౬.

క్షీరాభిషేకార్థ ♦ మూరూరిభక్తులు
సౌరభేయులనియ్య ♦ సంతతంబు
దివ్యమంత్రములఁద ♦ క్షీరధారలచేత
పురుషసూక్తవిధాన ♦ పూర్వకముగఁ
బూజలుసేయించి ♦ పుణ్యంబులార్జించి
ఘోరపాపంబులఁ ♦ గూలఁద్రోసి
పరమభక్తులుసేయు ♦ పద్ధతిఁబ్రకటించి
హరికర్పణంబుగ ♦ నాత్మనెంచి
నిరుపమానందభరితుఁడై ♦ నిత్యసేవ
నీకుజరిపించిపరదేశి ♦ నిత్యకీర్తి
భూషణుండాయె నిత్యవి ♦ భూతితోడ
వెలసితివిబొల్లవరపురి ♦ వెంకటేశ. 3౭.

సాధుసజ్జనకోటి ♦ నాదరంబునఁగాంచి
　　యన్నంబు బెట్టించు ♦ నర్థితోడ
భూసురేంద్రులుదారిఁ ♦ బోవుచోఁగనుపట్ట
　　భక్తితోడనుస్వయం ♦ పాకమిచ్చు
దేవునిపూజకై ♦ దివ్యపుష్పంబులు
　　దెప్పించిమాలిక ♦ ల్దీర్పఁబంపు
భక్తులుకలమాది ♦ బహుధాన్యమర్పింపఁ
　　గణజంబులకునించి ♦ గట్టిపఱచి
నిత్యపూజలనీరీతి ♦ నెగడఁజేసి
యెల్లవిధములసేవించు ♦ నుల్లమలర
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుటకును
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౩౮.

నిత్యనైవేద్యము ♦ ల్నీరాజనంబులు
　　బ్రత్యహంబునునిండు ♦ భక్తితోడ
జరిపించుచునుబ్రీతి ♦ శనివారమునరాత్రి
　　దేవునియుత్సవ ♦ దీపసేవ
అవనిపైమానవు ♦ లందఱుగొని యాడ
　　ధర్మమేజయమని ♦ దప్పకుండ
వేత్రంబుధరియించి ♦ వెఱ్ఱిఁబోలెఁజరించి
　　పుట్టగోచియునొక్క ♦ పట్టెడన్న
మనుభవించుచు దేవుని ♦ పనికిగాను
పాటుపడుచుండుపరదేశి ♦ పాలనార్థ
మవనిబొల్లవరంబున ♦ నధికలీల
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౩౯.

ఉపహారభక్ష్యాదు ♦ లొప్పగించినసొమ్ము
దేవునియేకాంత ♦ సేవకొఱకు
దెచ్చికోవెలయందు ♦ దేవీగృహంబును
బావియుమంటప ♦ పాళిమొదలు
నానావిధములైన ♦ నవ్యశిలామయ
ద్వారబంధంబులు ♦ తోరణములు
వంటశాలయుమేలి ♦ వప్రంబలంకార
మంటపంబునుమేటి ♦ మహిమగుల్క
తులసివాటియుమొదలగు ♦ పలుగకముల
పూలచెట్లును దేవుని ♦ పూజకొఱకు
వృద్ధిగావించిపరదేశి ♦ విపులకీర్తి
వెలసెనౌరరమాధీశ! ♦ వెంకటేశ. ౪౦.

నీనామమేకదా ♦ నిఖిలజగన్నాత
జపియించుమంత్రంబు ♦ జగతిలోన
నీనామమేకదా ♦ నిజముగాబరికింప
తారకబ్రహ్మమం ♦ త్రంబనంగ
నీనామమేకదా ♦ నిజభక్తకోటికి
నిక్షేపమైనట్టి ♦ నిజధనంబు
నీనామమేకదా ♦ నిఖిలపాపారణ్య
దావాగ్నిహోత్రంబు ♦ దలచిచూడ
ఇట్టినీనామమంత్రంబు ♦ గట్టిజేసి
గట్టువిలుకానిజేపట్టి ♦ గౌరివెలసె
బొల్లవరమున పరదేశి ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౪౧

శ్రీపుష్పాలనునిన్ను ♦ నయుతవత్సరములం
దభిషిక్తుఁజేసిన ♦ యధికఫలము
నేయిదీపంబులు ♦ నేత్రోత్సవంబుగా
వెలిగింపఁజేసిన ♦ విపులఫలము
తులసీదళసమర్చ ♦ నలుకోటులకొలంది
పొనరింపఁగల్గున ♦ మూల్యఫలము
లక్షగోవులనుస ♦ దక్షిణంబుగనీయు
నక్షయంబగునట్టి ♦ మోక్షఫలము
కలియుగంబునభక్తితోఁ ♦ గడియసేపు
నిన్నుఁదలంచినమకూరు ♦ నిశ్చయముగ
బొల్లవరమందునిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! వెంకటేశ. ౭౨.

దేహంబునిజమని ♦ మోహవార్ధిమునింగి
శ్రీహరిధ్యానంబు ♦ సేయమరచి
యాహారసంపాద ♦ నార్థమైయనిశంబు
కూహకవృత్తిజె ♦ కొనిచరించి
దారపుత్రాదులం ♦ దలిమోహముసఁజేసి
ఘోరపాపంబులఁ ♦ గూలిపోతి
నేరీతిదరిజేర ♦ నీదుదుస్సంసార
వారాశినికమీద ♦ వారిజాక్ష
భూరిచింతలలోబడి ♦ పొరలజాల
శ్రీరమాధిపనీదాపు ♦ జేర్చకొమ్ము
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౭౩.

ధరణీభరముడింప ♦ దైత్యులదండింప
హరిదశ్వకులమునం ♦ దవతరించి
జనకావనీనాథు ♦ తనయను బెండ్లాడి
యనుజన్ముడను దేర ♦ నతివగూడి
వనికేగినందున ♦ వైశ్రవణునిచేత
వనజాక్షిగోల్పడి ♦ వాలిఁద్రుంచి
సేతుబంధనమును ♦ జేసిలంకనుడాసి
యాతతాయులరావ ♦ ణాదిరిపుల
యమరులెన్నగబరిమార్చి ♦ యతివఁగూడి
నిండుమదితోడసాకేత ♦ నిలయమందు
రామనామంబు భువినివి ♦ రాజిలంగ
వెలసితివి బొల్లవరపురి ♦ వెంకటేశ. 22.

అమ్మవారిప్రతిష్ఠ ♦ నధికోత్సవంబుగా
నిమ్మహిలోశాస్త్ర ♦ సమ్మతముగ
నిమ్మళంబునఁజేసి ♦ నిర్మలనిజకీర్తిఁ
గ్రమ్మఁజేసెనునెల్ల ♦ కడలయందు
నిమ్మాడ్కిధనవంతు ♦ లెవ్వరొనర్చిరి
యమ్మహాభావంబు ♦ నంటుకొనగ
యుర్విలోస్థిరముగా ♦ నుద్ధరించెనుభక్త
వర్యుడాపరదేశి ♦ వాంఛఁదీర
సర్వవర్ణంబులకునన్న ♦ సత్రముంచి
గుర్వతిథ్యాదిసజ్జన ♦ కోటిఁదనిపె
బొల్లవరముననిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. 23.

# వేంకటేశ్వరశతకము.

సర్వశాస్త్రంబులు ♦ చదివినప్పటికైన
గురువులేకగుణంబు ♦ కుదురఁబోదు
పుణ్యతీర్థములందు ♦ మునిగిసేవించిన
గురువులేకమనస్సు ♦ కుదురఁబోదు
వాయుధారణలెన్ని ♦ వరుసగాజేసిన
గురువులేకమనస్సు ♦ కుదురఁబోదు
పంచగడ్డములెంత ♦ బెంచిచరించిన
గురువులేకమనస్సు ♦ కుదురఁబోదు
సద్గురువులేకసంసార ♦ సాగరంబు
దాటికడతేరశక్యమే ♦ తపసికైన
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౨౬.

నిరతంబుదేహంబు ♦ నేనునాయదియను
దురభిమానముచేతఁ ♦ దుర్లిపడుచు
కామాదిశత్రువ ♦ ర్గముగెల్వఁజాలక
నీమాయలోబడి ♦ నిమిషమైన
దారపుత్రాదులం ♦ దలిమోహపాశంబు
వదలించుకొనలేక ♦ వ్యర్థముగను
కాలంబుగడపితి ♦ కమలాక్షనీపదాం
భోజచింతనలేక ♦ మోసపోతి
ఇంకనైననునన్నునీ ♦ కింకరునిగ
నేలుకొనుమంచుమొక్కినీ ♦ పాలఁబడితి
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౨౭.

మనసార నీనామ ♦ మంత్రంబుఁదలచితే
ఘనపాపవనరాశిఁ ♦ గడగవచ్చు
చెవులార నీకథా ♦ శ్రవణంబొనర్చితే
భవరోగముల బాధ ♦ బాయవచ్చు
నోరార నినుఁగూర్చి ♦ నుతులొనరించితే
ఘోరాపదలఁబాఱ ♦ గొట్టవచ్చు
కనులార నీమూర్తిఁ ♦ గలయవీక్షించితే
కర్మేంధనంబులఁ ♦ గాల్పవచ్చు
నెల్లవిభవంబులాత్మలోఁ ♦ గల్లలనుచుఁ
దలఁచి నినుఁగొల్చుబరదేశి ♦ ధన్యుఁజేయ
బొల్లవరమునవిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౪౮

దానధర్మంబులు ♦ పూని చేసె[illegible]
పితృసంభృతధనంబు ♦ పేరులేదు
యజ్ఞయాగంబుల ♦ నాచరించెదనన్న
స్వార్జితమైన ద్ర ♦ వ్యంబులేదు
తీర్థయాత్రలఁగడ ♦ తేరుదమనుకొన్న
దేహదార్ఢ్యములేదు ♦ దిమ్మరుటకు
జపతపంబులనైన ♦ సల్పుదమనుకొన్న
చిత్తంబునిలువక ♦ చెదరిపోవు
కాన నీనామమంత్రమి ♦ క్కలియుగమున
పఠనసేయుట ముఖ్యంబు ♦ పద్మనాభ
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౪౯

# వెంకటేశ్వరశతకము.

గురుపాదయుగసేవ ♦ ఘోరసంసారాబ్ధిఁ
గడ తేరుటకు నావ ♦ కమలనాభ
గురుపాదయుగసేవ ♦ హరిహరబ్రహ్మాది
పరమపదంబున ♦ కరుగుత్రోవ
గురుపాదయుగసేవ ♦ కరణత్రయాఘంబు
పరిహరింప విశల్య ♦ కరణితీవ
గురుపాదయుగసేవ ♦ శరణుబొందిన వారి
నరసి రక్షింపంగ ♦ నమృతసేవ
గాన గురుపాద సేవ స ♦ ద్గతికి దెరవు
నమ్మి సేవింప దురితంబు ♦ నాశమొందు
బొల్లవరమునఁ బరదేశిఁ ♦ బోషించుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౫౮

అఖిలకర్మఫలంబు ♦ హరికర్పణముఁజేసి
సుఖదుఃఖముల మదిఁ ♦ జొఱయనీక
సమవృత్తియై నిత్య ♦ సంసారవిధమునఁ
జరియింపుచుండెడి ♦ జ్ఞానికరయ
పుణ్యపాపంబుల ♦ పొందొడఁగూడదు నే?
నీటి లోపల నళి ♦ నీదళంబు
రీతిభాసిల్లు హ ♦ రిప్రబోధము గల్గి
ఖ్యాతి గాంచుమహాత్మ ♦ గణములోన
గాన హరిభక్తియోగంబు ♦ గలిగెనేని
జీవభావంబు దొలఁగితా ♦ దేవుఁడగును
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫౯

దేవకార్యార్థమై ♦ తిరిగి భిక్షంబెత్తి
తెచ్చిన ధనమంత ♦ దేవళంబు
పనికిఁగానుపయోగ ♦ పరచితానందులో
నించుకైననుమిగి ♦ లించితినక
తనపొట్టకెవరేని ♦ ధర్మార్థమిడినట్టి
యన్నంబుదినుచుదా ♦ ననవరతము
పుట్టగోచి ధరించి ♦ భోగమ్ము ద్యజియించి
శీతోష్ణసుఖదుఃఖ ♦ చింతలేక
గాఢవైరాగ్యసంపత్తి ♦ గడలుకొనఁగ
ధరఁజరించెడి పరదేశి ♦ ధన్యుఁజేయ
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౬౦.

చిత్తశుద్ధినిఁజేయు ♦ చిఱుతపున్నియమైన
పరిపాకమున గొప్ప ♦ ఫలమునిచ్చు
శుక్తిలోపల బడ్డ ♦ సూక్ష్మనీరకణంబు
మంచిముత్తియమునై ♦ మించుకరణి
ఆదరంబున బెట్టు ♦ సాదమించుకయైన
పేదవారికిఁబెద్ద ♦ పేరిమెనిచ్చు
శ్రద్ధతోడుతఁజేయు ♦ సకలధర్మంబులు
పెద్దగాఁగనుపించు ♦ పేరుగాంచు
గాన దానంబుధర్మంబు ♦ ధనికుఁడరసి
చేసినట్లైన యది చాల ♦ శ్రేష్ఠమగును
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౬౧.

హరినామధేయంబు ♦ నవశుద్ధి బఠియింప
దురితంబులనుబట్టి ♦ దహించివేయు
వైకుంఠు నామంబు ♦ పలికిన యంతట
శోక మోహంబుల ♦ చొప్పడంగు
అచ్యుతనామధే ♦ యౌషధంబును గొన్న
ముక్తరోగుండయి ♦ మునమునొందు
మధుసూదనునినామ ♦ మంత్రంబుఁదలచిన
విధుతపాపుండయి ♦ విష్ణుఁగలయు
తలప నిక్కవినామమును ♦ త్రంబుకన్న
దురితముల బాపుకొనననొండు ♦ త్రోవలేదు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౫౮.

పుట్టుచావులు లేని ♦ బోధమార్గము సున్న
గట్టిగా గురుపంచఁ ♦ గాచకున్న
మూఁడుమూర్తుల మొట్ట ♦ మొదలెరుంగుట సున్న
గట్టిగా గురుపంచఁ ♦ గాచకున్న
కామాదిశత్రువ ♦ ర్గము నడంచుటసున్న
గట్టిగా గురుపంచఁ ♦ గాచకున్న
సుఖదుఃఖముల మూల ♦ సూత్రమెరుఁగఁసున్న
గట్టిగా గురుపంచఁ ♦ గాచకున్న
సద్గురుండనుదర్పణ ♦ సరణిలేక
తన్నుఁదానుఁగనుంగొన ♦ టన్నసున్న
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౫౯.

కలికాలభవఘోర ♦ కలుషసంతమసాలి
పరితప్తగ్రహేలినీ ♦ పాదధూళి
కామాదిదుర్గుణ ♦ గ్రామమత్తగజాళి
పంచాననంబు నీ ♦ పాదధూళి
భవసంచితానేక ♦ పాపవారిదపాళి
పవమానకేళి నీ ♦ పాదధూళి
తాపత్రయాగ్నిసం ♦ తప్తజీవులపాలి
పరిపూర్ణవృష్టి నీ ♦ పాదధూళి
పాపపర్వతదంభోళి ♦ పాదధూళి
భక్తమానసహంసాళి ♦ పాదధూళి
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫౬.

గురుపాదయుగళంబు ♦ గోరి సేవించిన
నరయఁ బ్రహ్మానంద ♦ మబ్బుటరుదె?
గురుపాదయుగళంబు ♦ గురుతుగా నమ్మిన
బరమాత్మభావంబుఁ ♦ బడయుటరుదె?
గురుపాదయుగళంబు ♦ గూర్చి భజించిన
దోషంబులన్నియుఁ ♦ దొలఁగుటరుదె?
గురుపాదయుగళంబు ♦ మరుగు జొచ్చినవారి
కాపత్పరంపర ♦ లణగుటరుదె?
గానసద్గురు పదసేవఁ ♦ గలిగెనేని
భుక్తిముక్తులు నిజముగాఁ ♦ బొందవచ్చు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడఁ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫౭

చిత్తంబు భవదీయ ♦ సేవాచరణమందు
వర్తించు మీస్తోత్ర ♦ వాక్కులందు
నాలుక నీమంజు ♦ నామాక్షరములందు
శ్రవణంబు నీగుణ ♦ శ్రవణమందు
చూట్కులు నీదివ్య ♦ సుందరాకృతియందు
చేతులు పూజావి ♦ శేషమందు
పాదముల్ప్రాసాద ♦ పరివేష్టనములందు
తల నీనమస్కార ♦ తతులయందు
నియమనము జేసి నీభక్తి ♦ నిష్ఠనాకు
చెదరకుండగఁ జేయుమో ♦ శ్రీనివాస
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫౦.

విషయశాఖలపైన ♦ వివిధలీలఁజరించు
చపలచిత్తంబను ♦ గపినిఁబట్టి
భవహారంబగు నీదు ♦ పాదమూలంబున
భక్తిపాశంబునఁ ♦ బాటినీక
దృఢముగాబాధించి ♦ దినదినక్రమమున
స్వాయత్తపరచి ని ♦ స్సారమైన
తుచ్ఛసంసారంపు ♦ తోవనఁ బోనీక
ముక్తసంగుల మార్గ ♦ మునజనంగఁ
జేసి రక్షింపుమో దేవ ♦ శ్రీనివాస
వాసవార్చితపద! నీకు ♦ వందనములు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౫౧.

వేదవేదాంగాది ♦ విద్యావిచారంబు
మేదినీసురలకు ♦ చేదుదోచె
వర్ణాశ్రమాచార ♦ వర్తనంబులుదమ
నిర్ణయంబులుసెడి ♦ నీటఁగలిసె
దేవతాదిపితృవి ♦ ధిక్రియల్విరమించి
జీవనార్థంబులు ♦ క్షితినడంగె
కలిదోషమునధర్మ ♦ మిలనిల్వఁ బడలేక
కులహీనజనులందు ♦ గురిగనిల్చె
గాన బ్రాహ్మణజాతికి ♦ గౌరవంబు
నాడునాటికి సన్నమై ♦ నాణెమణగె
బొల్లవరమున భక్తులఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౫౨.

హరియన్న నరకంబు ♦ తెరువున జనకుండ
నరునిసంరక్షించు ♦ నామమహిమ
నారాయణాయన్న ♦ నందకధరుదివ్య
మందిరంబును జేర్చు ♦ మంత్రమహిమ
మాధవాయని యన్న ♦ మాయనుఁ దరియింప
జేయుదివ్యాక్షర ♦ శ్రేణిమహిమ
వాసుదేవా యన్న ♦ వసుధ జన్మించక
శ్రీసమేతునిఁ జేరు ♦ సిద్ధమహిమ
నామమంత్రప్రభావ మ ♦ నంతమగుట
తెలియనేరరు దేవనీ ♦ దివ్యమహిమ
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౫౩.

# వెంకటేశ్వరశతకము

శ్రీనివాస సహస్ర ♦ శిష్టభక్తులఁగావ
పూని బొల్లవరాఖ్య ♦ పురమునందు
పరదేశి యనుభక్త ♦ వరుని ప్రార్థనచేత
సిరిఁగూడివిజయంబు ♦ జేసినావు
నీకు మానసభవా ♦ నేకోపచారము
ల్గావింప నాచిత్త ♦ కమలమందు
వేడుక లిగురొత్త ♦ వివిధార్చనంబుల
గావింతు ననునింధు ♦ కరుణఁజూడు
భక్తగణముల పాలిటి ♦ పారిజాత
భుక్తిముక్తుల దయచేసి ♦ బ్రోవుమయ్య
బొల్లవరమున పరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౽౨.

సదయాంతరంగ నా ♦ స్వాంతపద్మమునందు
ముదమారనినుఁ జేర్చి ♦ మ్రొక్కికొలుతు
మదిలోన నేఁజేయు ♦ మానసపూజల
ముదమొంది ధ్యానంబు ♦ మొదలుగాగ
పదియారుపూజల ♦ పరితుష్టినొందియా
పదలన్ని బాపి నీ ♦ పదమొసంగి
తుదిలేని నీకృపా ♦ నిధికిఁబాత్రునిఁజేసి
మదమోహహేతుతా ♦ మసమణంచి
చేరి రక్షింపవేని యో ♦ నీరజాక్ష.
భూరిజన్మంబులనుఁబడి ♦ ఘోరలఁజాల
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినటిరమాధీశ! ♦ వెంకటేశ. ౽౩.

భావింతు నీదివ్య ♦ పాదపద్మంబుల
పావననామముల్ ♦ పఠనసేతు
వర్ణింతు నీకథా ♦ వారాశివిభవంబు
కర్ణముల్దనియ నీ ♦ కథలువిందు
పూజింతు నీయాది ♦ పూరుషరూపంబు
జరియింతు నీభక్త ♦ జనులలోన
జపియింతు నీనామ ♦ చతురక్షరంబుల
నపవర్గసిద్ధికై ♦ యనవరతము
భక్తజనపాపసంహార ♦ భవవిదూర
యెల్లవిభవంబులాత్మలో ♦ గల్లలనుచు
దలచి నినుగొల్చుపరదేశి ♦ ధన్యుజేయ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౭౪.

ఆశాహనముచేసి ♦ యాంతరంగికభక్తి
సేవింతునో దేవ ♦ శ్రీనివాస
వేవేగమచ్చిత్త ♦ విమలసౌధమునందు
శ్రీవనితామణి ♦ జేరినిలిచి
భావకల్పితములౌ ♦ బహువిధపూజల
గైకొనినామీద ♦ కరుణనించి
జన్మకర్మాది వాస ♦ నల బోగొట్టినీ
చిన్మయపదమున ♦ జేర్చుమయ్య
దయనుబాలింపకున్ననీ ♦ దాసజనుల
నరసిరక్షించువారునా ♦ కొరులుగలరె
ధరనుబొల్లవరాఖ్య ♦ పత్తనములోన
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౭౫.

# వెం క టే శ్వ ర శ త క ము.

హృదయాబ్జకోశంబు ♦ విదళించి యందునీ
యుదయార్కకోటిస ♦ ముజ్జ్వలంబు,
మదనకోటిప్రతి ♦ మానసౌందర్యంబు
నగు దివ్యరూపంబు ♦ ననవరతము
చెదరని భక్తిచే ♦ చింతనంబొనరించి
పదియింద్రియంబుల ♦ ఘణమణంచి
మదినిబ్రహ్మానంద ♦ మగ్నంబుఁగావించి
కుమరైన మేటి త్రి ♦ కూటమందు
బొదలుపరమాత్ముఁగని పరి ♦ పూర్ణభావు
లయిరి తొల్లింటిసన్మును ♦ లమరవంద్య
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౬౯.

హరినామకీర్తనం ♦ బను నంజనముచేత
పరమాత్మభావంబు ♦ బడయవచ్చు
హరినామ చింతనం ♦ బను నౌషధముచేత
దురితరోగంబుల ♦ దోలవచ్చు
హరినామకీర్తనం ♦ బను నాయుధముచేత
శారీరశత్రుల ♦ జదుమవచ్చు
హరినామచింతనం ♦ బను లవిత్రముచేత
ఘోరపాపలతాళిఁ ♦ గోయవచ్చు
హరిదలంచిన దురితంబు ♦ లణగిపోవు
గరుడు గనుగొన్న పాముల ♦ కరణిధరణి
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౭౦.

ఆహారనిద్రాభ ♦ యవ్యవాయంబులు
పశువులకును బోలె ♦ ప్రజలకెల్ల
సామాన్యములు, విశే ♦ షంబు వివేకింప
ధర్మమొక్కటియని ♦ తెలుపవలయు
ధర్మమార్గము త్రోవ ♦ దప్పిన మనుజుండు
నాల్గుకాళులు లేని ♦ నరపశువని,
ధర్మశీలురఁ బెద్దల ♦ ధర్మాత్ములనివాని
పొరుగున బోవరా ♦ పురుషపశువు
చర్మమాతపత్రముల ♦ చరణములకు
కాలిజోడున కైనను ♦ వీలుపడదు
బొల్లవరమునఁ బరదేశిఁ ♦ బ్రోచుకొనకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. -౮.

హరినామసంకీర్త ♦ నామృతపానుఁడ
నరులార యికనుజ ♦ న్మంబు లేదు
కరిరాజవరదుని ♦ కథలాలకింపుఁడీ
దురితాబ్ధి గడతేరు ♦ దురు నిజంబు
గోవిందు మహిమంబు ♦ భావించి తెలియుఁడీ
శ్రీవధూరమణునిఁ ♦ జేరఁగలరు
సాధుసజ్జనముల ♦ సంగతి సేయుఁడీ
బోధమార్గము మీకు ♦ బొందుపడును
కల్లసంసార మీగతి ♦ గడచినారు
తొల్లి యోగీంద్రులెల్ల! యీ ♦ త్రోవఁదెలిసి
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొనకు
వెలసినట్టి రమాధీశ! వెంకటేశ. ౭౯.

నీపాద సంభూత ♦ నీరమా సురలోక
సోపానమైసర్వ ♦ పాపములంచు
నీపాద సంభూత ♦ నీరమా గిరిసుతా
సాపత్న్యమున చాల ♦ సౌఖ్యమొందె
నీపాద సంభూత ♦ నీరమా శంతను
భూపాలు పత్నియై ♦ పుత్రుబడసె
నీపాద సంభూత ♦ నీరమాకపిలర్షి
కోపాగ్నిభస్మంబుఁ ♦ గోరితడిపె
ఇట్టినీపాదనీరంబు ♦ నెవ్వరేని
మునిగి సేవింపవారికి ♦ మోక్షమబ్బు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. 20.

హరినామకీర్తనం ♦ బంత్యకాలమునందు
మరువకజపియించు ♦ మానవుండు
పరిహృతబహుజన్మ ♦ పాపబంధనుడయి
యాత్మసాక్షాత్కార ♦ మధిగమించు
యాత్మసాక్షాత్కృతి ♦ నధిగమించుటజేసి
కర్మానుబంధముల్ ♦ కడకు దొలగు
కావునకర్మాను ♦ గమనంబుదేహంబు
వకుఁగాని జీవున ♦ కొకటిలేదు
శ్రవణ మననాదులనుఁజేసి ♦ భవముబాసి
శివుడు శివుడయివెలయు ని ♦ శ్రేణియదియు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. 21.

తెల్లవారఁగ లేచి ♦ దేహయాత్రలు దీర్చు
  నెల్లవారికి గర ♦ ణీయమయ్యె
మధ్యాహ్నమైనంత ♦ మజ్జనభోజన
  క్రియలొనర్చుట ముఖ్య ♦ నియమమయ్యె
సాయంసమయమైన ♦ సర్వమానవులకు
  నిద్రావ్యవాయముల్ ♦ నియతమయ్యె
తక్కిన వేళల ♦ తమతమసంసార
  మొక్కొక్కరికి జాల ♦ యెక్కువయ్యె
అదను దొరకక దేవ!నీ ♦ పదయుగంబు
కుదురుగా నమ్మి ♦ కొల్చుటకదను లేదు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౨౨.

కామాదిశత్రువ ♦ ర్గము గెల్వలేకున్న
  శ్రీమనోహరుదివ్య ♦ సీమసున్న
అష్టాక్షరీమంత్ర ♦ మభ్యసింపక యున్న
  పుట్టుచావులు లేని ♦ పొలముసున్న
అరయ సద్గురుపాద ♦ మాశ్రయింపక యున్న
  హరినిగాంచెడు పెద్ద ♦ తెరువుసున్న
సంసారమోహంబు ♦ సమయఁజేయక యున్న
  కంసారిభక్తసం ♦ గతియుసున్న
గాన సత్సంగమమయుక్తి ♦ కారణంబు
మానవులకెల్ల కాలంబు ♦ మరువజనదు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. 23.

నారాయణాయను ♦ నాలుగక్షరముల
పారాయణమె, దేహ ♦ ధారికరయు
ఘోరాపదలఁదుంచి ♦ భూరిపాపమడంచి
నీరేజనేత్రుని ♦ నిలయమునకు
జేరంగ జీవుల ♦ జేరుచు మంత్రంబు
ధీరుఁడై తెలతెల ♦ వారునప్పుడు
దారపుత్రాదుల ♦ దలఁపులన్నియు మాని
శ్రీరమారమణతో ♦ శ్రీనివాస
నుచు దేవుని ననిశంబు ♦ నభినుతింప
నరకమెన్నటికిని లేదు ♦ నమ్మకంబు
బొల్లవరమున పరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౭౮.

కామంబుదినదిన ♦ క్రమమున గుదియింప
ధీమంతుఁడై కడ ♦ తేరునరుడు
ఆజ్యమగ్నినిఁబోయ ♦ నంతకంతకుమండి
యభివృద్ధిఁగాంచిన ♦ యట్లు,ఁగామ
మనుభవించిన తీరు ♦ ననుమాటశూన్యంబు
కామానలంబుచేఁ ♦ గలుగు క్రోధ
మదియార్పబడకున్న ♦ నవ్వేలదండుల
మదమునఁజంపున ♦ మ్మానవుండు
గానఁ గామంబుక్రోధంబు ♦ మానవులకు
నాంతరంగికశత్రువై ♦ యతనిజెరుచు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౭౯.

తనదిగానిది యెంత ♦ ధనమైనదానిపై
మనసుఁ జేర్పఁగరాదు ♦ మానవునకు
తనదిగానిది యెట్టి ♦ ధవళాక్షియైనను
మనసుఁ జేర్పఁగరాదు ♦ మానవునకు
తనదిగానిది యెంత ♦ వినదగుసొమ్మైన
మనసు జేర్పఁగరాదు ♦ మానవునకు
తనదిగానిది యెంత ♦ తపనీయచయమైన
మనసు జేర్పఁగరాదు ♦ మానవునకు
తనకుగప్రాప్తిగం బైన ♦ నమిడిగాని
చాలునని యెడివాఁడుసా ♦ త్వికుండు
బొల్లవరమునవిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ.

తనలోనిశత్రుల ♦ దండింపగాలేక
మునుపటిపెద్దలు ♦ మోసపోయి
వనితామణులమీఁది ♦ వాంఛలలోఁజిక్కి
ఘనయోగములమంటఁ ♦ గలిపికొనుచు
ననిశంబు సంసార ♦ మను మోహమునఁజిక్కి
జన్మకర్మాదిల ♦ క్షణసముద్ర
మునమున్గిపోయిరి ♦ మూర్ఖుఁడనే నెంత
ఘనుడను దేవ! నా ♦ మనములోన
గాఢతమమైన భక్తిని ♦ గలుగఁ జేసి
దాసజనములలోఁ జేర్చ ♦ దయనుగావు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౽౽.

దేహంబుపై యాశ ♦ తీరదెప్పటికైన
శ్రీహరిస్మరణంబు ♦ సేయవలయు
మోహాలతాబంధ ♦ ములఁదెగింపఁగోరిన
శ్రీహరిస్మరణంబు ♦ సేయవలయు
అంతరంగికశత్రు ♦ లార్వురఖండింప
శ్రీహరిస్మరణంబు ♦ సేయవలయు
విషయవాంఛలనెల్ల ♦ విడువంగవలెనన్న
శ్రీహరిస్మరణంబు ♦ సేయవలయు
కలియుగంబున పాపసం ♦ కటమడంచు
శ్రీహరిస్మరణంబున ♦ చేటులేదు
బొల్లవరముననిత్యవి ♦ భూతితోడఁ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౭౮.

కుదురుగాఁగూర్చుండి ♦ చెదరనిభక్తితో
హృదయంగమమ్మైన ♦ మృదుపదంబు
లధికకవిత్వంబు ♦ నల్లినీకర్పించి
పదిలమౌవైకుంఠ ♦ పట్టణమున
ముదమారసారూప్య ♦ మోక్షసామ్రాజ్యాఖ్య
పరమపదంబును ♦ బడసినట్టి
హరిదాసజనులలో ♦ నరయంగనొకఁడనై
యుండగాఁగోరినీ ♦ యండఁజేరి
నాఁడనో దేవనినుఁగొని ♦ యాడనెంత
వాఁడ? ననుకంపదృష్టినన్ ♦ జూడవేల
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౭౯.

నీవుండు కొండపై ♦ నిఖిలదేవతలుదా
మేవేళనివసించి ♦ హేలతోడ
శ్రీవృషమహాపులై ♦ సేవించుచున్నారు.
దేవదేవ! మహాత్మ ♦ దివ్యవనిత
లేవంకఁజూచిన ♦ తీవెలై నీపూజ
గావించుచున్నారు ♦ కాంక్షతోడ
భావింప నీయొక్క ♦ కోవెల తెరవున
గోవిందనామంబు ♦ గొల్లలాడి
జీవనంబులు గడపెడి ♦ జీవులెల్ల
భావిజన్మాదులందునఁ ♦ బరమమునులు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౮౦.

కోవెలలోనుండు ♦ కోతులన్నియు నిన్నుఁ
గొల్వ దెబ్బదిరెండు ♦ వెల్వకపులు
రాముఁడవై నీవు ♦ రాజ్యంబుపాలించి
నీవుండు వైకుంఠ ♦ నిలయమునకు
వేవేగ వేంచేయ ♦ నీవెంటఁజనలేక
శ్రీవెంకటేశాఖ్య ♦ శిఖరియందు
నీవు దేవుఁడవయి ♦ నిలిచెదవని యెంచి
సేవసేయఁగఁ గొండఁ ♦ జేరినారు
భావిజన్మాదులా కోతి ♦ బలగమునకు
లేవు బరికింప నీవిప్పు ♦ డీటతోడ
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౮౧.

బొల్లవరంబె నీ ♦ కల్ల వైకుంఠంబు
కోవెలయే నీకు ♦ గోప్యగృహము
ప్రాకారమే నీకుఁ ♦ బ్రణవస్వరూపంబు
శ్రీకాంతయే నీయ ♦ చింత్యశక్తి
పరదేశియే నీకు ♦ ప్రార్థితప్రవరుండు
పడమటికోనేరు ♦ విరజతటిని
సరిలేని గోపురే ♦ పరమభక్తులుగల్గి
ధరణిపై వైకుంఠ ♦ ధర్మమొప్పి
నిరుపమాన విభూతితో ♦ నిలచినావు
పురజనుల నేటిభక్తులఁ ♦ బ్రోచినావు
ధరణిబొల్లవరాభిధ ♦ పురమునందు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౧౨.

పెండ్లి పేరంటంబు ♦ లిండ్లలో నెరవేర్ప
లేకకొందఱు చాల ♦ రిక్తులగుచు
నీకొండకరుదేర ♦ నిష్కమైనను లేక
భుక్తిముక్తులకును ♦ మూలమయిన
నీదు సాన్నిధ్యంబె ♦ నిఖిలశుభంబుల
కాస్పదంబనియెంచి ♦ యాచరింప
దంపతులకును న ♦ త్యాయురారోగ్యముల్
మేదురసంపద ♦ ల్మేలొసంగి
రక్షణముసేతు వోపక్షి ♦ రాజవాహ!
భక్తరక్షణదక్ష దీ ♦ వ్యత్కటాక్ష
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టి రమాధీశ! వెంకటేశ. ౧౩.

వసుధపై రెండవ ♦ వైకుంఠమననొప్పి
నిరుపమానానంద ♦ నిలయుఁడైన
హరిపుండరీకాక్షు ♦ డార్తశరణ్యుండు
పరమాత్ముఁడిందిరా ♦ పతిసమస్త
పరికరంబులతోఁడ ♦ పరదేసి యందలి
కరుణావిశేషంబు ♦ గానుపింప
సిరిఁగూడి విజయంబు ♦ చేసినకతమున
నరులందఱు భక్తి ♦ నతులొనర్చి
దురితమెడఁబాసి కడతేరు ♦ తెరవుగలిగె
ననుచుఁగొనియాడ నవనిలో♦ఘనతమెఱయు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౮౮.

కమలాప్తదాసహ్యా ♦ త్కమలభాస్కరనీవు
కలికాలజనులకు ♦ గల్మషముల
కమరఁజేయుటకు వే ♦ ంకటశైలమునఁ జేరి
కడలేని యాపద ♦ ల్గలుగువారి
కొండకు రప్పించి ♦ ముండితులనుజేఁసి
దండుగ బెట్టించి ♦ గండడంచి
నిండుదోపులు దోచి ♦ నిర్మలులనుఁ జేసి
దండించురాజన ♦ దనరినావు
ఇట్టి సాహసమెవ్వరి ♦ కేనిఁగలదె
దిట్టతనమున నీవంటి ♦ దేవుఁడెవఁడు
బొల్లవరమునవిత్య వి ♦ భూతి తోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౮౯.

## వెంకటేశ్వరశతకము.

త్రికరణంబుల నొక్క ♦ తీరుగా నడచుటే
సకలధర్మంబులు ♦ సలిపినట్లు
సర్వభూతములందు ♦ సమబుద్ధిగల్గుటే
యెల్లవిద్యల సార ♦ మెఱిఁగినట్లు
మమకారమడఁగించి ♦ మదిఁజక్క నిల్పుటే
నాలుగాశ్రమములు ♦ నడపినట్లు
గురుమంత్రమున మది ♦ కుదుళ్ళగానిల్పుటే
పరమాత్మరూపంబుఁ ♦ బడసినట్లు
వేయిపుణ్యంబులిక యేల ♦ వేద్యమేల
సర్వశాస్త్రంబుల విచార ♦ సరణియేల
బొల్లవరమునఁ బరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౧౬.

ధరణిలో వెంకటే ♦ శ్వరుఁబోలు దేవుండు
వివరింపగాలేడు ♦ వెఱ్ఱులార
కలికాలమున శక్తి ♦ గలవేలుపాతండు
బహుభోగభాగ్యసం ♦ పదలుగల్గి
యేడుగొండలపైన ♦ వేడుక బంగారు
మేడగట్టుగ కాంతి ♦ మెఱయువాఁడు
పరదేశికొఱకిప్డు ♦ సిరిఁగూడిమనబొల్ల
వరముననిత్యోత్స ♦ వములతోడ
వఱలుచున్నాఁడు ♦ సేవింపవలయుమనకు
భుక్తిముక్తులనియ్యంగఁ ♦ బూనినాఁడు
సందియంబేల మనకును ♦ తన్నుయమిదియె
డెందమునఁ గల్గుకోర్కుల ♦ బొందుటకును ౧౭.

నీనామరూపని ♦ త్యానుసంధానంబు
మౌనీంద్రులకు నిత్య ♦ మంగళంబు
నీనామరూపని ♦ త్యానుసంధానంబు
దీనులకిలకామ ♦ ధేనుగణము
నీనామరూపని ♦ త్యానుసంధానంబు
జ్ఞానుల కానంద ♦ కారణంబు
నీనామరూపని ♦ త్యానుసంధానంబు
మానసవ్యథలకు ♦ మాపుమందు
నామరూపానుసంధాన ♦ నామజపము
చేసితొల్లింటి పెద్దలే ♦ చేటులేని
చిరతరానందపదమును ♦ జెందినారు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౮౫.

కన్నారమేయెందుఁ ♦ గానిశ్రీహరిఁబోలి
యున్నట్టి దేవు నీ ♦ యుర్విలోన
విన్నారమే మన ♦ విద్వత్తములు చెప్పి
సన్నుతింపఁగ హరి ♦ కన్నమిన్న
తిన్నారమే మన ♦ మెన్నఁడైనహరిప్ర
సన్ననామముకన్న ♦ మిన్నఫలము
అన్నారమే మన ♦ యనుభవంబునహరి
కన్నమిన్నగు వేలు ♦ పలరనుచు
నట్టి శ్రీహరి వెంకటే ♦ శాహ్వయంబు
పెట్టుకొని వెల్గుచున్నాఁడు ♦ పృథివిలోన
బొల్లవరమునఁబరదేశిఁ ♦ బ్రోచుకొఱకు
వెంకటేశునిగొల్వఁడీ ♦ వెజ్జులార. ౮౬.

అతిరసంబులు తేని ♦ యను భుజించుటకన్న
హరిమీది పద్యంబు ♦ లదికతీపు
యావుపాలన్నంబు ♦ నారగించుటకన్న
హరిమీది పద్యంబు ♦ లదికతీపు
కలకండ బాదాము ♦ కలిపితినుటకన్న
హరిమీదిపద్యంబు ♦ లదికతీపు
హల్వాజిలేబీల ♦ నారగించుటకన్న
హరిమీదిపద్యంబు ♦ లదికతీపు
ఇందుసుఖమిచ్చు నివియెల్ల ♦ నిందునందు
సుఖము గల్గును హరిపద్య ♦ సేవవలన
బొల్లవరమున పరదేశి ♦ బోధిచినట్టి
వెంకటేశుని గొల్వుఁడీ ♦ వెఱ్ఱులార. ౬౦.

కవులమంచును గొంద ♦ రవివేకబుద్ధులై
నవనవామృతరస ♦ దవములూరు
పదముల నందంద ♦ వెదకిదొంగిలి తెచ్చి
యదికి కవిత్వంబు ♦ నల్లితేటి
కడుపులు పూఁడెనె ♦ మనకిరాతులకిచ్చి
తుదకు నిష్ఫలములై ♦ తొలఁగినట్లు
మదమోహ కలితులౌ ♦ మానవేంద్రులకిచ్చి
యెదఁగోర్కె దీరక ♦ హీనులగుచుఁ
బొదులు చెందుదు రీరీతి ♦ పుడమిజనులు
వదనముల నెత్తఁజాలక ♦ వక్రమతులు
బొల్లవరమున నిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టిరమాధీశ! ♦ వెంకటేశ. ౬౧.

కడుపునఁబుట్టిన ♦ కన్నియనమ్మిన
ట్లుడుగనియాశచేఁ ♦ బుడమిరేండ్ల
కడకేఁగి వారికిఁ ♦ గాతుకంబొదవించు
నుడువుల నోడఁగూర్చు ♦ నూత్నమయిన
కొడవుగాఁగఁగవిత్వ ♦ ధోరణిచెలువార
కడుగీర్తిమీఁకిలఁ ♦ గలుగుదీని
నుడివినాఁడనునాకు ♦ బొడవైనబహుమతి
నిడుమంచు వారిచ్చు ♦ పడుపుగాసు
కడుపునిండుఁగ భుజియించి ♦ కాలమీట్లు
గడుపుకా కవులనుబట్టి ♦ కాలయముడు
మిడుతలనుఁబోలె నగ్నిలో ♦ బడగవేల్చు
విశదముగబోల్లవరపురి ♦ వెంకటేశ. ౯౨.

పందేశిభక్తిచే ♦ గురుబిక్షలనుగొని
కడుపార భుజియించి ♦ జ్ఞానపతిర్
నుడుగక సేవించి ♦ యోగంబు ధరియించి
పిడుగులకైనను ♦ బెదరిపడక
నిడుపకెంజడలును ♦ నిల్పటంగినిఁదాల్చి
నడుమున గోఁచియు ♦ నగుమొగంబు
గలిగి జీవేశ్వరైక్యత్వంబు ♦ గట్టిగ
మదిఁదలంచుచు బ్రహ్మ ♦ పదమునందు
కుదురుఁగాల్చి రిపులనా ♦ ర్గురిజయించి
పొదలుచున్నట్టిహరిభక్తి ♦ పూర్ణుడగుచు
బొల్లవరముననిత్య వి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౯౩.

నారాయణుని దివ్య ♦ నామమంత్రముచేతఁ
బ్రహ్లాదబాలుండు ♦ భక్తుఁడయ్యె
నారాయణునిదివ్య ♦ నామమంత్రముచేత
ధృవుఁడొందెనిశ్చల ♦ ధృవపదంబు
నారాయణునిదివ్య ♦ నామమంత్రముచేత
నారదుండాత్మవి ♦ హారుఁడయ్యె
నారాయణునిదివ్య ♦ నామమంత్రముచేత
భీష్ముండు జగతి స ♦ భేద్యుఁడయ్యెఁ
తారకబ్రహ్మమంత్రమ్ము ♦ దారిదెలిసి
ధీరుఁడైనట్టిపరదేశిఁ ♦ జేరిహరిని
బొల్లవరముననిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౯౮.

తారకబ్రహ్మమం ♦ త్రవిశారదుండైన
వాఁడెపో మేటివి ♦ ద్వాంసులందు
సప్తాక్షరీమంత్ర ♦ మహరహంబుజపించు
వాఁడెపో మేటివి ♦ ద్వాంసులందు
ద్వాదశాక్షరమంత్ర ♦ తత్పరుండైనట్టి
వాఁడెపో మేటివి ♦ ద్వాంసులందుఁ
బ్రణవమంత్రరహస్య ♦ పద్ధతిదెలిసిన
వాఁడెపో మేటివి ♦ ద్వాంసులందు
ననుచునిమ్మంత్రజపముల ♦ నాచరించి
ఘనులుసంసారవారాశి ♦ గడచినారు
బొల్లవరమున నిత్యవి ♦ భూతితోడ
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౯౯.

పరమభక్తుండైన ♦ పరదేశిరెడ్డికిఁ
జిరతరాయుష్యంబు ♦ సిరియుమిగుల
హరిభక్తియునిరంత ♦ రాత్మవిజ్ఞానంబు
కరణత్రయవిశుద్ధి ♦ గలుగునటుల
హరివేంకటేశ్వరు ♦ డాశీర్వదింపుచుఁ
జిరకాలమీబొల్లి ♦ వరమునందు
నిరుపమానములైన ♦ నిత్యవైభవములఁ
బరిపూర్ణుఁడై నిజ ♦ భక్తవరులఁ
గరుణఁబ్రోచుచుఁ గలికాల ♦ కల్మషములఁ
బొలియఁజేయునుగాత శ్రీ ♦ బొల్లవరము
పరిసరంబున నుత్తర ♦ పార్శ్వమందు
వెలసినట్టి రమాధీశ! ♦ వెంకటేశ. ౯౯.

ప్రోద్దుటూరనియెడు ♦ పురముననివసించు
విప్రవర్యులలోన ♦ విదితయశుఁడ
శేషశాస్త్ర్యభిధాన ♦ శేముషీమంతుఁడఁ
బండితపామర ♦ ప్రజలకెల్ల
హృద్యంబుగాసీస ♦ పద్యశతముఁజేసి
వెంకటేశ్వరుపేర ♦ నంకితంబు
గావించినాఁడను ♦ సావధానంబుగాఁ
జదివియిందలిభక్తి ♦ సారమెఱిఁగి
బొల్లవరముననుండెడు ♦ పుణ్యపురుషు
లెల్లదీనినిపయచేసి ♦ యుల్లమలర
నచ్చువేయించివెలయింపుఁ ♦ డార్యులార
వెంకటేశ్వరుకృపఁగాంచి ♦ వెలయఁగలరు. ౧౦౦.

## వెంకటేశ్వరశతకము.

ఈపద్యశతకంబు ♦ రేపుమాపుఁబఠింపఁ
దాపత్రయాంబుధి ♦ దాటఁగలరు
ఈపద్యశతకంబు ♦ రేపుమాపుబఠింప
శ్రీపతిసన్నిధిఁ ♦ జేరఁగలరు
ఈపద్యశతకంబు ♦ రేపుమాపుబఠింప
భూపాలురై భూమిఁ ♦ బుట్టఁగలరు
ఈపద్యశతకంబు ♦ రేపుమాపుబఠింపఁ
బాపంబులెడఁబాసి ♦ బ్రతుకఁగలరు
గాన నీపద్యములరెండు ♦ కాలములను
బరనసేసినవరులకు ♦ బ్రహ్మపదము
సులభమైయుండుఁగావున ♦ సుజనులార
భక్తితోడబఠింపుఁడీ ♦ భద్రముగను. ౯౮.

ఆచంద్రతారార్క ♦ మగుచునీశతకంబు
ప్రాచుర్యమునుగాంచి ♦ ప్రబలుఁగాత
భూచక్రమునయందు ♦ పురుషవర్యులకిది
వాచోవిధేయమై ♦ వరలుఁగాత
ప్రాచీననూతన ♦ పండితులీకృతిఁ
జూచినవారల ♦ నూయపడక
తోఁచినతప్పుల ♦ డాచిపెట్టఁగఁబోక
సవరించిపుణ్యంబు ♦ సంగ్రహింతు
రనుచు మిమ్ములవేడెద ♦ వనఘులార
వేంకటేశ్వరనామధే ♦ యాంకితముగఁ
జేసినాఁడనునను ♦ దయచేఁగనుండు
బొల్లవరమునవివసించు ♦ పుణ్యులార. ౯౯.

జపతపస్స్వాధ్యాయ ♦ విపులధర్మనిరూఢి
యలర విప్రచయంబు ♦ వెలుఁగుఁగాక
జనులనుదమకన్న ♦ తనయులటుల నేలి
వసుధేశసంఘంబు ♦ వఱలుఁగాక
మూఁడుమాఱులుమాస ♦ మునకువర్షముగల్గ
సస్యసమృద్ధియుఁ ♦ జఱుగుఁగాక
యంగనామణులుము ♦ త్రైదువులై సతీ
గుణముఁబాయకవెలుం ♦ గుదురుగాక
కవులకేవేళవిజయంబు ♦ గలుగుఁగాక
కొమరులనపత్యులకునుగ ♦ లుదురుగాక
యాయురారోగ్యభోగభా ♦ గ్యములుగలిగి
లోకమెల్లనుమిగులసు ♦ శ్రీకమగుత

సంపూర్ణము.

శ్రీ ప్రొద్దటూరు నివాసుడయిన మామిళ్ళపల్లె శేష శాస్త్రుర్లు చేశిన భక్తిరస ప్రధానంబగు శ్రీ బొల్లవర వెంకటేశ్వర సీసపద్యశతకము

ఇట్లు,
డి. రాజశేఖరము.

Printed at the Janaki Printing Works, Proddatur

